








హైటెక్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, మ. నగర్, సెల్ : 94410 49299

# జయహో తెలంగాణ






**పాలమూరు జిల్లా కవుల ఉమ్మడి కార్యాచరణ సమితి**

**పాలమూరు.**

# జయహో తెలంగాణ

## పాలమూరు కవుల కవితా సంకలనం

( సకల జనుల సమ్మె )



సంపాదకులు

**భీంపల్లి శ్రీకాంత్**

**గుముడాల చక్రవర్తిగౌడ్**

**కట్టా గిరిజా రమణ**

పాలమూరు జిల్లా కవుల ఉమ్మడి కార్యాచరణ సమితి

పాలమూరు

జయహో తెలంగాణ
*Jayaho Telangaana*
ప్రతులు 1000
ముద్రణ 30.09.2011 ( సకల జనుల సమ్మె )

రూపాయలు: 10/-

ప్రతులకు :
భీంపల్లి శ్రీకాంత్
గుముడాల చక్రవర్తిగౌడ్
కట్టా గిరిజా రమణ

అక్షరాకృతి
కట్టా గిరిజా రమణ
అచ్చిపందు (గ్రాఫిక్స్), సద్దలగుండు, పాలమూరు

ముఖచిత్రం–
అరుణ్ కుమార్,
హైటెక్ (గ్రాఫిక్స్), మహబూబ్‌నగర్

ముద్రణ
హైటెక్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, పాతబస్టాండ్ రోడ్, మహబూబ్‌నగర్.





## దూరమై దగ్గరౌదాం

కె. నవీన్ 9493320208

ఎన్ని
ముళ్ళు వేసినా
దారం తెగిపోతున్నప్పుడు
ఎవరి దారి వాళ్ళు
చూసుకోవడమే మంచిది
ఒకడుంటే
మరొకడికి కన్నీళ్ళే
మిగల్తాయనుకున్నప్పుడు
విడిపోవడమే మంచిది
ఒప్పందాలు, హామీలు, జీ.ఓ.లు
ఒక్కడే ఉల్లంఘిస్తున్నప్పుడు
ఇద్దరి మధ్యా
అపనమ్మకాల జెండాలెగురుతున్నప్పుడు
ఎవడి బతుకు వాడు
బతకడమే మంచిది
ఇద్దరూ కలిసుండే ఇల్లు
కల్లోలభరితమైనప్పుడు
ఏది మంచిదో
ఏది చెడ్డదో
ఏది ఎందుకు మంచిదో
ఏది ఎందుకు చెడ్డదో
చెప్పీచెప్పనట్లు చెప్పి
తప్పించుకు తిరగడమెందుకు
గోడమీది పిల్లి వేషాలేయడమెందుకు
కలిసుంటే కలహించుకోవడమే
అవుతుందనుకుంటే
ఒకరిపై ఒకరికి
విద్వేషాగ్నులు రగలకముందే

రక్తసిక్త దృశ్యాలు
చరిత్ర తెరమీద
ఆవిష్కృతమవకముందే
జత వీడడమే మంచిది
ఒకడు విడిపోవాలనుకుని
విభజనరేఖ గీసుకున్నాక
ఇద్దర్నీ కలిసుండమని
బలవంతం చేసేవాడు
బలగాల్ని దింపేవాడు ద్రోహి

ఇచ్చేది మేమే తెచ్చేది మేమే
రాజీనామాల డ్రామాలాడి
ప్రజాభిప్రాయానికి నీళ్లొదిలి
అధిష్టానం ఆదేశాలకి తలొగ్గేవాడు ద్రోహి
ద్రోహుల్ని ఎండగడ్తు
ద్రోహులపై తిరగబడ్తు
వేరుపడడమే మంచిది
వేరుకాపురం పెట్టడమే మంచిది

సోదరుడా!
దగ్గరై దూరమవ్వాలనుకున్నాక
దూరమై దగ్గరవ్వాలనుకోవాలి
కలిసుండి విడిపోవాలనుకున్నాక
విడిపోయి కలిసుండాలనుకోవాలి
సోదరుడా!
రేపు రాబోయే యుద్ధానికి
ఇద్దరం కలిసే సిద్ధం కావాలి!





## జర భద్రం కొడ్కో!

భీంపల్లి శ్రీకాంత్ 9032844017

కొడ్కో
వాడు ఇసుట్కి రమ్మంటే
ఇల్లంతా నాదేనంటడు
పనిజేస్కునింకె వొచ్చినోడు
మన పల్లెనే దోసుకతింటున్నడు
కొడ్కో
వాడు
తిన్నింటి వాసాలు లెక్క పెట్టెటోడు
మన కడుపులనే కొడుతున్నడు
జర బీదోడని, దిక్కులేనోడని
ఉండనీకె ఇల్లు తిన్నింకె బువ్వ
కట్టనింకె బట్ట ఇస్తె
వాడు మన కడుపుల మీదనే
కాలుమోపుతున్నడు
రేగడి విత్తుల్ని జల్లినోడు
మన గుండెలపై గడ్డపారలు గుచ్చుతున్నడు
కంచె చేనుమేసిందంటే ఇదే
వాడికి ఇన్ని జేసిన గూడ
నమ్మక ద్రోహం జెయవట్టె
నమ్మకంగానే ఉంటూనే నయవంచన జేయవట్టె
నా ఎంటనె తిర్గినోడు నా పక్కన పండినోడు
నా ముంతనే తాగినోడు నన్ను నట్టేట
ముంచవట్టె
రాను రాను నా తల్లిని నరకయాతన
పెట్టవట్టె
కూలికి వచ్చినోడు ఫ్యాక్టరీలనే కట్టబట్టిండు
మన అన్న తమ్ముండ్లనే కూలీలుగా
పెట్టుకుంటున్నడు

కాడ్కో పాలేరుగా వచ్చినోడు
కామందుగా మారిపోయిండు
ఇదంతా మన మిచ్చిన అలుసే
కాడ్కో
మనం వాడికిపుడు గులాములయినం
వాడిపుడు
మన సాపకింద నీరయ్యిండు
వాడిపుడు మెలమెల్లగా జెర్రిలా పాకి
కొండసిలువై పోతున్నడు
కాడ్కో
వాడిపుడు కిరాయికున్న ఇల్లునే కొన్నాడు
తర్వాత ఊరు ఊరునే కొన్నాడు
ఒక సెరువు ఒక కుంట ఒక సెల్క ఒక పంట
అన్నీ అన్నీ కొన్నడు
చివరికి మనల్ని బిచ్చగాల్లను జేసిండు
కాడ్కో ఇగ జూస్నివా
వాడు అడవిలో తిర్గె జిత్తులమారి నక్క
వాడి తియ్యని ఇగ్రం వల్ల మనం
మోసపోయినం
ఇన్నాళ్ళు గుడ్డి బతుకులు బతికినం
బత్కనీకె మన పొలిమేర వొచ్చినోడు
ఇపుడు పొగబెట్టి సూస్తున్నడు
అడుక్కుతిన్నింకె వొచ్చినోడు మనల్నే అడుక్కోమంటున్నడు
వూరికి సెని వట్టినట్టు వాడు మన తెలంగాణకె సెనయ్యిండు
కాడ్కో! వాన్ని
మన ఇంటి నుంచి మన పల్లెనుండి
మన తెలంగాణ నుంచి ఎల్లగొట్టాలంటే
మనమంతా ఒక్కటి గావాలె
నాల్గుకోట్ల మందిమి
తరిమి కొట్టనీకె సిద్ధం గావాలె.





## రాజుకున్న అగ్గిరవ్వ

కట్టా గిరిజా రమణ 9440348265

ప॥ రగులుతున్న తెలంగాణ ఒక్కటైనది
రాజుకున్న అగ్గిరవ్వ భగ్గుమన్నది
ఏ శక్తీ ఆపలేదు ఏ యుక్తీ పారబోదు
జగమంతా తెలంగాణ తథ్యమన్నది ॥రగులు॥

చ॥ ఎన్నాళ్ళీ వేదనలు ఎన్నేళ్ళీ శోధనలు
ఎన్నేళ్ళీ పీడలు ఎన్నాళ్ళీ పాడెలు
నీటికొరకు నింగికొరకు కన్నీటితొ
కొంగు పట్టి దేహీయని యాచనేంది ॥ రగులు॥

చ॥ రుద్రమలు కాపయలు కాపుకాచినారు
కొమరంలు సురవరాలు శంఖమూదినారు
జనమంత ఏకమై నేతల చీటి చించినారు
సకలజనులు ఒక్కటై కదిలి సాగినారు ॥ రగులు ॥

చ॥ మోసాలకు విరుగుడేది - తెలంగాణ
దారుణాలకు దవాయేది - తెలంగాణ
త్యాగాలకు ఫలితమేది - తెలంగాణ
ధర్మపోరాటపు వేదికేది - తెలంగాణ ॥రగులు॥

చ॥ తూరుపు ఎరుపెక్కింది అమర జ్యోతులతో
దారులు మూసుకు పోయాయి ఆగ్రహ జ్వాలలతో
లాఠీలు, తూటాలు వేన వేలు ఎగిసి పడిన
తెలగాణ వీరుల ముందు తలలువంచినాయి ॥ రగులు॥

## కౌరవులారా కాచుకోండిక !

కమలేకర్ శ్యాంప్రసాద్ రావు
9441076632

ఏమిటి
అంధ మన్మోహన ధృతరాష్ట్ర పాలన
ఎక్కడ బధిర సోనియా గాంధారి
ఆహా!
అక్రమార్కులే కౌరవులు

ఓహో!
పాచికలాటలో వూరి శకునిమామ
ఏమి ధుర్యోధనుని దుస్సహకిరణ దుష్టపన్నాగాలు
ఏమేమి గడపాటి చేయని దుశ్శాసనుని
దుస్సాహసం

అదేమిటి
కురుక్షేత్రంలో రాబందుల అలజడి
అయ్యో!
అభిమన్యుశ్రీకాంతులు ఒక్కొక్కరే నేలకొరుగుతున్నరే

అరే!
కుంగిన చక్రంతో రాజసింహు కర్ణుని పోరాటం
ఓహో! భీష్ముడప్పుడే అంపశయ్యపై ఒరిగాడే
అదిగో రథసారథి శ్రీకృష్ణుడు
పాంచజన్యం పూరిస్తున్నాడు

పది జిల్లాలడిగిన పాండవులారా!
దించండిక జమ్మిచెట్టుపైని ఆయుధాలు
సమరోత్సాహంతో దూసుకొస్తున్నారు
సకలజనులు! సమ్మెట దారులై
ఓ కౌరవులారా! కాచుకోండిక !!





## కలం - కలకలం

గుముడాల చక్రవర్తిగౌడ్
9441059424

నేటి ముఖ్యమంత్రి
హైకమాండ్ రిక్రూట్ చేసిన
ఔట్ సోర్సింగ్ ఉద్యోగి
తాత్కాలిక ఉద్యోగం పాపం !
ఎన్నాళ్ళుంటుందో ఏమో?

ఆంధ్రాలో బిందు సేద్యం
తెలగాణలో బిందెసేద్యం
ప్రభుత్వం చూస్తోంది చోద్యం
అక్కడ నిధుల పరుగు
ఇక్కడి నిర్లక్ష్యం దేవుడెరుగు
అక్కడ పంటలకు నీళ్ళు
ఇక్కడ ప్రజలకు కన్నీళ్ళు

నిప్పును ముట్టుకుంటే చేతులు కాలుతాయి
ఉద్యోగులతో పెట్టుకుంటే పదవులు ఊడుతాయ్
చరిత్ర చెప్పిన సత్యం ఇది వినకపోతే మీ ఖర్మం

ఆశ చూపితే
ఆర్టీసీ చక్రం తిప్పుతుందా?
తెలంగాణ ఇవ్వకుంటే
పయ్య ముందుకు కదులుతుందా?
ఆశతో దోపిడీలు చాలు
తెలంగాణతో దాగుడుమూతలు

ఇంకెన్నాళ్ళు
సకలజనుల సమ్మె
బద్దలైన అగ్నిపర్వతం
ఆపాలనుకుంటే
మాడి మసై పోతారు జాగ్రత్త

' సో ' నీయమ్మా
ఇంకా
ఉలకవు పలకవు?
సకలజనుల
సమ్మెట పోటు
మీ పార్టీకి తెస్తుంది
చేటు
ఇకనైన మేలుకో
తెలంగాణ ఇచ్చిపో

పాఠాలు
నేర్పినోళ్ళం
గుణపాఠం
నేర్పలేమా!
మీ చరిత్ర ప్రజలకు చెప్పి
ఇంటి దారి
పట్టించలేమా!

మేము
నిరాయుధులం కాము
ఓటు
వజ్రాయుధ సాయుధులం
రణ రంగం
కాదు మాకు కొత్త
తెలంగాణ ద్రోహుల్లారా
జర భద్రం
ముందుంది
ఓట్ల పండగ





## సకలజనుల సమ్మె

యం. బుచ్చన్న 9705643332

సర్వ జనుల సమ్మె
సకల జనుల
సమర శంఖారావం
కదం తొక్కిన ఉద్యోగులు ఉపాధ్యాయులు

నిరసన ధ్వనించిన
తెలంగాణ ప్రజలు
మూతబడ్డ ప్రభుత్వ కార్యాలయాలు
సర్కార్ సేవలు బందులు

కదలి వచ్చిన విద్యార్థులు
వైద్యులు, న్యాయవాదులు
సచివాలయంలో నిరసనలు
ఉస్మానియాలో ఉద్రిక్తతలు
సమ్మె ఆరంభం సమరం తీవ్రం

ప్రభుత్వ పాలన స్తంభనం
సహాయ నిరాకరణోద్యమం
ప్రభుత్వం దిగొచ్చేదాక ఉద్యమం
తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు తథ్యం !

## తెలగాణ పాట

కమలేకర్ డాగోజీ రావు 94492278702

ప॥ రావోయి తెలగాణ వీరుడా
రావోయీ తెలగాణ పౌరుడా
తెలగాణ జయగీతి పాడరా
తెలగాణ దుస్థితి చూడరా ॥ లేవోయీ॥

చ॥ ఆంధ్రునకు నీకింక సరిపోదు పొత్తు
అటులె పొత్తున్న నిన్నను నతడు తొత్తు
దోచుకున్నారుగా మనదంత సొత్తు
కాచుకొన్నారింక చేయగా చిత్తు ॥ లేవోయీ॥

చ॥ కలసివుంటే మనకు కలిమి లేదింక
కలిసి ఉన్నన్నాళ్లు కలతలే యింక
బ్రతుకంత వెతల పాలై పోవునొకవంక
బ్రతుకెంతొ చితికి చీకాకౌ మరొకవంక ॥ లేవోయీ॥

చ॥ విడిపోయి పొందుదము శాంతి సౌఖ్యాలు
బడయుదము మనమెన్నొ భోగ భాగ్యాలు
నిలుపుకొందము మనము ప్రగతి మార్గాలు
నిర్మించుకొందమిక రమ్య హర్మ్యాలు ॥ లేవోయీ॥

చ॥ తెలుగు పలుకుల వెలుగు కొత్త అందాలు
తెలుగు వెలుగుల నింక తొలగు అంధాలు
తెలుగు తల్లికి పులుము మంచి గంధాలు
తెలుగు బిడ్డల కింక తొలగు బంధాలు ॥ లేవోయీ॥

చ॥ తెలగాణమిది మనకు మాగాణము
తెలుగు నాడుకు మనమే ప్రాణము
నిలుపుదము మనము తెలగాణకే గారము
సలుపుదము యెపుడు తెలగాణనే ధ్యానము ॥ లేవోయీ॥





## ఒక ఉద్వేగ కన్నీటి దీపం

జనజ్వాల 9949163770

చేతులు నరుక్కున్న తరవాత
స్నేహహస్తాలు ఏమిటి?
తలలు తెగ తెంచుకున్న తరువాత
బ్రతుకు పంటలు ఏమిటి?
వళ్ళంతా పచ్చిపచ్చి గానే వుంది
అన్నీ కనిపిస్తున్న గాయాలే
కాలుతున్న చమురు వాసనలే
ఒకటి మాత్రం నిజం
మీరు తెల్లోడితో
తెగతెంపులు చేసుకోడానికి
వర్తమానంలో వర్తక వలస పీడక పాలకులపై
యుద్ధం చేసితిరి!
మేము కూడా యుద్ధానికి ఊతంగా
గీతం పాడితిమి!
తెల్లతెల్లారక ముందే విజయసంబరాన్నీ
నడిరేయి సూర్యున్ని చేసుకుంటిరి
మేము మాత్రం ! చీకటి కుంపటుల్లోనే
తెలంగాణ అవ్వగా ... ఎక్కడా విముక్తి పోరు అంటే
ఆశతో పాట పాడాం! ఆట ఆడాం!!
"గర్జించు రష్యా, గాండ్రించు చైనా" ఒక్కటేమిటి!
దేశదేశాల పోరాటాల పిడిబాకులను ముద్దు
పెట్టుకున్నాం ! ముందుండి నడిచినాం!
ఎందుకంటే
మా జననమే ఓ యుద్ధ కేక
అగ్ని గర్భం దాల్చిన అమ్మ బిడ్డలం!
నవాబో.. నైజామో... రజాకార్లో....
పటేల్, పట్వారి, భూసామి, దొరోడో....

" బాంచన్ కాల్మొక్తాం" బ్రతుకువాక్యమో
భరత వాక్యమో .....
రక్త నదులతో జీవిత తలలు పండిన
పంట భూమి మాది
అయ్యా అన్నీ కనిపిస్తున్న గాయాలే
అమరత్వ త్యాగాల పర్వతాలే
అయ్యా తెల్లోడితో దేశభక్తి అంటిరి
ఎన్నా తమ్మి అన్న పొరుగు వాడితో తెలుగు జాతి అంటిరి
మీ బాధలకు భ్రాంతినిచేసి , మా ప్రాంతం బంతి చాలు చేసితిరి
చేతిలో చేయి బలవంతంగా లాగుకొని చేసిన బాసలన్నీ
బద్మాష్‌గిరి చేసితిరి....
వెన్నుపోటు, నీటిపోటు, నీడపోటు,
పెన్నుపోటు, గన్నుపోటు..
ఏ పోటైనా మీతోనే నేర్చుకోవాలి
బ్రిటిషోడైనా, అమెరికోడైనా ఈ సారి....
అమ్మకం కొనడం తప్ప ! ఆత్మీయత తెలియని
తెల్లోడి అన్నలారా! వర్తక వ్యాపార పాలకయ్యలారా!
ఒక్క అడుగు వెనక్కువేసి తలను నిమురుకుంటు
నిదానంగా గతాన్ని , గమ్మత్తు చేయకుండా
గాబరా పడకుండా మల్లె పూలదండతోనే
చదువుకోండి అయ్యా! చదువు ఎట్లాగు మాకు రాదు
కుత కుత వుడుకుతుంది నెత్తురున్న మాంసం!
కుట్ర కనిపించదు! కుతంత్రం కనిపిస్తుంది!
అయ్యా! ఇప్పుడు రెండు స్పష్టంగానే చిన్న చిన్న
పోరగాళ్ళకు కూడా కనిపిస్తున్నవి!
కుట్ర ఒక రహస్యం! కుతంత్రం ఒక
మోసక చర్య!
క్యాబినెట్ హోదాలో తెలుగు భాష ఉద్ధరించాలనే
కమ్మ కమ్యూనిస్టునయ్యా
ఎవరి' మన' సాక్షిగా జలయజ్ఞం కనిపించెనో
మహాకవి గీతం వినిపించెనో





ఇన్నాళ్ళ యిజంతో జర్నలిజం చూసినోడా
" నరాల ప్రవాహం, సముద్రం , ఒంటి నడక
జనం విముక్తి గానం ..... మా
తెలంగాణ ! కనిపించక పాయెనా!
తెలంగానం మహాకవుల
రక్త ఘోష వినిపించక పాయెనా!
ఎవరికి ఈ ప్రబోధం!
ఎవరిది ఈ ప్రలోభం!
అమాయకత్వం మీద అబద్ధాలతో
ఎన్నాళ్ళన్నా! జూదం ఆట
ధర్మరాజులమన్నా మేము
మోసపోయినా .... ఆటాడని ఓటమి
గాళ్ళమన్నా!
వనవాసం, అజ్ఞాతవాసం, అన్ని
ఉపవాసాలతో
" వందేమాతరం, విప్లవ తెలంగాణం" గర్జిస్తున్నాం
తొడలుగొట్టి, శృంఖలాలు పగలగొట్టి,
చురకత్తులు పదునుపెట్టి
తుది సమరం సాగిస్తున్నాం!
యుద్ధభూమిలో
మళ్ళీ నడిరేయి సూర్యుని కోసం
కళ్ళల్లో స్వాగత తోరణాలు కట్టుకున్నాం
ఒక ఉద్వేగ కన్నీటి దీపంతో......

రేపుకూడా
ఒక యుద్ధ జ్వలనం
మా పొత్తిళ్ళ కడుపులో దాగివుంది
విప్లవం వర్ధిల్లి తీరుతుంది

## కృష్ణ కమిటీ
## ( కోలాటం పాట )

డా॥ అగ్రహారం ఛందోజీ రావు
9440932900

ప॥ యాలవచ్చె కృష్ణకమిటేల వచ్చెరా
మాయదారి కమిటి వచ్చి మహిమ జేసెరా ॥ 2॥
అది మోసం జేసి తెలంగాణ కద్దుపడేరా ॥2॥ యాల॥

చ॥ రాయపాటి జెప్పినట్లు రాసి యిచ్చెరా ॥2॥
అది లగడపాటి మాట విని జగడం బెట్టెరా ॥2॥యాల॥

చ॥ సుబ్బిగాని సూటుకేసు కృష్ణకమిటీ ॥2॥
అది తిక్క రిపోర్టిప్పిచ్చే కృష్ణకమిటీ ॥2॥యాల॥

చ॥ కృష్ణుడంటె ధర్మమయ్య కృష్ణకమిటీ ॥2॥
ఆ పేరు చెడగొట్టిరయ్య కృష్ణకమిటీ ॥2॥ యాల॥

చ॥ ఒక్కసారి మళ్ళిరార కృష్ణకమిటీ ॥2॥
వచ్చి తెలంగాణ దెబ్బ సూడు కృష్ణకమిటీ ॥2॥

## బతుకమ్మ

సతీశ్ 9949219213

తంగేడు పూల తన్మయత్వం
పలకరింపుల పరవశత్వం
పులకరింపుల పూల మృదుత్వం
తెలంగాణ బతుకు కవిత్వం





## గడప దాటండి

కోట్ల వెంకటేశ్వర రెడ్డి
9440233261

ముక్కు చెవుల్మూసి
నడినెత్తిన గుద్దుతుంటే
బతికే ఉన్నానంటవ్

నీది ఒక బతుకేనా?

నాల్గున్నర కోట్లమంది
మెడమీద చెయ్యేసి
నీవొద్దు, నీ సోపతొద్దు అంటుంటే !

చూరుపట్కు ఎలాడుతనంటవ్

థూ...... నీ .......
ఇది నీ ఏలికా?
నిట్టి నిలువు చీలికా!!

బొక్కరుచి మరిగిన కుక్క.
తిడితే ...పోదంట!
కొడితే ...పోదంట!

సకలజనుల సమ్మెతో సాగనంపుతుంటే
ఉలకవ్ ! పలకవ్!!
గింతకంటె ఏం జెప్పాలె

గడువు ముగిసింది
గడప దాటండి.......

## దగా పడ్డ తెలంగాణా

యం.డి. ఖాజామైనద్దీన్ 9396626276జ

దగా ..... దగా..... దగా...
అడుగడుగునా దగా... దగా
ఉమ్మడి కుటుంబం
జోల పాటలతో సాగిన దగా

దశాబ్దాలుగా
చిటారుకొమ్మన మిఠాయి పొట్లాన్ని
చేతుల్లో పెడతామంటూ
సమైక్యత సినీవాలి కాంతులను
సందు సందులో నింపుతామంటూ
పెద్దమనుషుల ఒప్పందమనే పెద్దమోసం
కంటి చూపును పోగొట్టింది

అందమైన బంగారులేడి
అరుసూత్రాల పథకం
నడకను ఆగమాగం చేసింది
ఆంధ్రులకు ఉద్యోగాల పందేరంతో
యువత జీవనాడిని తెగ్గోసింది

కాగితాల మీద ఒప్పందాలు
శిల్పాక్షరాలై కనపడుతున్నా
తెలంగాణా గుండెకాయ చుట్టూ
తెప్పలుగా సాగిన అభివృద్ధి
మట్టి మనుషుల మూలవాసుల
గొంతు తడపడం మరచిపోయి
అభివృద్ధి గ్రాఫుకు
అలంకారాలు చెక్కుతున్నది

నరాలలా నదులు ప్రవహిస్తున్నా
దూపగొని అంగలార్చిన భూమి నెర్రెలిడిసింది
రక్త ప్రసరణాన్ని స్తంభింపజేసి
మళ్ళించుకుపోయిన నదులతో





హరితవనంగా మారిన పెత్తందారీతనం
సమైక్యతే ముద్దంటున్నది
ఓపికకు ఒక హద్దుంటుంది
దోపిడీ భాష చూపించే

అందాల భావన మాటున
ఊరించి ఊరించి చూపించే
ఆదర్శ నమూనాకు కాలం చెల్లింది
దేహాన్ని సన్నిపాత రోగానికి గురిచేసి
దేశాన్ని ఆరోగ్యంగా ఉంచుతానంటున్న
తీపిమాటల సమైక్యత మత్తులోంచి
జోలపాటల నుండి బయటపడిన
తెలంగాణ నేడొక ప్రవాహం

అవమానాల సంకెళ్ళు తెంచుకొని
పురా దు:ఖానికి చెల్లుచీటీరాసి
దగా ఆనకట్టలను కూల్చేసి
వేటాడబడడం నుండి తప్పించుకోవడానికి
పోరాట సునామీని సృష్టించి
స్వాభిమాన జండా ఎగరేస్తుంది.

## ఉద్యమ జ్యోతుల్లై తిరిగొస్తారా

బోల యాదయ్య 9912206427

పఠ అమరులై వెలుతున్నారా... మీరు
పొద్దయి పొడుస్తున్నారా...
కెరటమై ఎగిసినారా... మీరు
కాలి బూడిదయినారా.... ॥ అమరులై॥

చఠ వేనోల్ల గొంతుకలు నాదమై పాడింది
ఏడ ఉన్నారో బిడ్డలు ఏడున్నారని
కన్న తల్లి గుండె నిప్పుల్లో కాలింది
అన్నదమ్ముల ఆత్మ చితిమంట నీడైంది
పల్లె కోయిల పాట మూగవోయింది
మిమ్ము సూడనిదే పాట పాడనంది ॥ అమరులై ॥

చఠ పదిజిల్లాల్లోన పల్లవై సాగింది
పేరు పేరున తలసి బోరుమంటుండ్రు
నివాలి పేరుతో నిన్ను తలిసిండ్రు
గుండెలో ఒక పక్క మిమ్ము దాసిండ్రు
జోతులై తిరిగొస్తారా మీరు
మాతో పోరుకై కలిసొస్తారా ॥ అమరులై ॥





## తెలంగాణ పోరు బాట !

కె. రఘురాములు గౌడ్ 9490911645

పఠ అమ్మమ్మ సోనియమ్మా
మాయమ్మ సోనియమ్మ
తెలంగాణ ఇవ్వమంటె
చెలగాట మాడకమ్మా ॥ అమ్మ॥

చఠ చెలగాట మాడబోకు
శ్రామికుల దూరబోకు
ఇక సాకు చెప్పబోకు
సెగ దలుగదాయె నీకు ॥ అమ్మ॥

చఠ ఊరూర దప్పు మోత
ఉవ్వెత్తు మోగె కూత
ప్రతి వారి నోట పాట
తెలగాణ పోరుబాట ॥ అమ్మ॥

చఠ ఆగిపోయె పనులు
అవస్త పడిరి జనులు
సామాన్య ప్రజల బ్రతుకు
సంకటము లాయె తుదకు ॥ అమ్మ॥

చఠ బంధు లధికమయ్యె
సంపూర్ణ బంధులాయే
ఇబ్బంది లధికమాయే
ఇకనైన తెలుపవమ్మా ॥ అమ్మ॥

## రక్త తెలంగాణ !

డా॥ నాయికంటి నరసిహ్మ శర్మ
9441357400

రణ న్నినాదంతో తెలంగాణ
గణగణ మ్రోగిన గంటలమ్రోత
పోరు బిడ్డలందరిలో సమరం
సలసల కాగే చమురయ్యింది

బిగిసిన పిడికిలి విసిరిన వడిసెలు
బందిపోట్లపై పిడుగులయ్యినవి
లగడపాటి కావూరి దివాకర్
దొంగఎత్తులను చిత్తుచేసినవి

కమ్మరి కుమ్మరి చాకలి మంగలి
మేదరి కంచరి బాపన కోమటి
ఆటోరిక్షా పాను దుకాణం
ఒక్కటై ఉరూర జనావళి
కొదమ సింహాలై లంఘించి
పొద్దే పొడవని పోరు సల్పినరు

ముప్పొద్దుల తెగమెక్కి బలిసిన
తెలంగాణ ద్రోహులను తరుముతూ
బిర బిర చరచర చిందులేసినరు
పల్లెటూల్లలో పనులు ఆగినవి

పసులు గూడ తెలంగాణ సోయిన
ఆగకుండ రంకెలేయ సాగినయి
ఇంటింట తెలంగాణ పాట
రామనామ స్మరణంగ మారినది

సోనియమ్మ ఇగనన్న కరుగవా
మాకు జప్ప తెలగాణ యియ్యవా





## వీర తెలంగాణ !!

టి. వెంకట్రాములు 9492503070

ప॥ ధీర తెలంగాణ .. వీర తెలంగాణ
శూర తెలంగాణ .. పోరు తెలంగాణ ॥ ధీర ॥

చ॥ మహబూబ్‌నగర్ మాది
మరి కరీంనగర్ మాది
మహా భాగ్యనగర్ మాది
గుడ్లెల్లబెట్టబోకు ॥ ధీర॥

చ॥ వరంగల్ జిల్లా మాది
నల్గొండ జిల్లా మాది
ఖమ్మం జిల్లా మాది
కనికట్టు సాగదింక ॥ ధీర ॥

చ॥ నిజామాబాద్ మాది
అదిలాబాద్ మాది
మెదక్ రంగారెడ్డి మాది
పది జిల్లలు కలిసున్న తెలంగాణ మాది ॥ ధీర ॥

## సంధికాలము చెల్లెను

కొంకతి నర్సింహులు 9951197382

ఉ॥ ప్రాణములన్ తృణంబుగను భావనజేసి విముక్తికై తెలం
గాణము నాలపించెగద గ్రామములున్ ఘన పట్టణంబుతొ
క్కోణము లోన కోటి శత కోటి గళమ్ములు పాడె ఢిల్లియే
గాణము చేయు తప్పదిక కాలము చెల్లెను నెహ్రు సంధికిన్

## నా తెలగాణ తల్లి !నవ్వుతూ వస్తోంది !!

పి. మీనా కుమారి 9440209608

నా తెలంగాణ
కోటి రతనాల వీణ
అంటూ మురిసిపోయాం మొన్నటి దాకా!

స్వార్థపరుల కబంధహస్తాల్లో
చితికిపోయి నా తెలంగాణ తల్లి యిపుడు
తీగలు తెగి రక్తకన్నీరు కారుస్తోంది
గొంతెత్తి ఏడుస్తోంది బాధలు తొలగించమని

చేయి చేయి కలిపినాము
పదం పదం కలిపినాము
సకలమై సంకుల సమరం సల్పినాము

అధినాయకు గుండెల్లో గుబులు
బంధనాలు వేయడానికి శోధనలు
గడ్డిపోసలు ఒక్కటైనాయి, ఏనుగైతేనేమి!
బంధనాలు వీడే సమయం అదిగో

తీగలు సవరిద్దాం, కొత్త రాగాలు పలికిద్దాం
ఘనమైన చీరలతో ముస్తాబు చేద్దాం
బతుకమ్మల ఆటలతో స్వాగతిద్దాం

అదిగో నవ్వుతూ నా తెలగాణ తల్లి వస్తోంది
ప్రతి ముంగిట్లోకి నిండు పున్నమిని తెస్తోంది.





## ఇక మీ నాటకాలకు తెర దించుండ్రి !

కె.ఎ.ఎల్. సత్యవతి 9440210103

మా తెలంగాణ కోసానికి గిన్నేల్లసంది పోరాటం చేస్తున్నం
బండకింది మాచేతిని నొప్పి గాకుండ తీయనీకి చూస్తున్నం
మా తెలంగాణ మాకిమ్మంటే సప్పుడు సెయ్యకుండ కూసున్నరు
సమైక్యాంధ్ర పొయ్యిల మా బతుకు కాలబెడుతుండ్రు
కలిసుంటే సుఖమంటని నీతులు మస్తుగ జెపుతున్రు
మట్టసంగ మా చెవులల్ల కాయితం పూలు పెడుతున్రు
మా కొలువుల్ల మీ పిలగాల్లకు కుర్చీలు మా పోరలు పరదేశానికి వలసలు
మా చీమల పుట్టలు ... మీ దొంగ పాముల పాలు
బీడువడ్డ మా బూవులకు లేవు సుక్క నీళ్ళు
అరిచరిచి ఎండిపాయె మా గొంతుకలు
లాఠీ దెబ్బలకి పాయె మా పానాలు
మీ పొలాలకు మా నదుల నీటి దూప
కండ్ల నీల్లు తుడుసుకుంట వూకె వున్నం పడి సూసుకుంట
బడిల బొక్కులు తెరవంగనె మీ ఫోటువులు మీ కతలు
ఏడ కనిపియ్యవు మావోల్ల నామోనిషానలు గురుతులు
మా పల్లకిల ఎన్నడు మేమెక్కి కూసోకనె పోతిమి
తిట్టుకుంట మిమ్ముల మోసుకుంట తిర్గితిమి
అన్నాయం పాడుగాను! కానోల్లు ఎండి తల్లెల్ల తినబట్టిరి
ఖాలీ ఆకుల ముగాలు జూస్కుంటు ఆకల్తో సావబడ్తిమి
అరె! పెయ్యి కలిసి పుట్టిన అమడాల పిల్లలా ! ఆంధ్ర తెలగాణ బిడ్డలు!
ఇడదీస్తే పోతయ్యా! ఎవరివైన పానాలు!
గిప్పుడు తెలగాణ అంటుకున్న అడివయ్యింది
మా జొన్న రొట్టె బలం జూపుడు షురువయ్యింది
సకలజనుల సమ్మెకు పెద్దల గద్దెలు కదలాలె
ఎంబడే మా తెలగాణ మాకివ్వనింకె ఉరికి రావాలె
సముజాయించగ జూస్తున్నరేమొ దేనికి ఇనేదే లేదు
మా తెలంగాణ వచ్చుదాక సమ్మె ఆపె ముచ్చట్నే లేదు

## జై తెలంగాణ ! జై జై తెలంగాణ !!

నందిగామ కిశోర్ 9347229036

అర శతాబ్దం దాటినా
తెలంగాణ ప్రజల
ఆకాంక్ష నెరవేరలేదు

కుట్రలు కుతంత్రాలు పన్ని సీమాంధ్రులు
ఉద్యమాలను త్యాగాలను
అణిచేస్తూనే ఉన్నారు!
ఇక్కడి రాజకీయులు
స్వంత లాభాలకు అమ్ముడు పోతున్నారు!
తెలంగాణ ప్రజల
ఆకాంక్షల బంతితో ఆడుతూనే ఉన్నారు!

అయినా
ప్రజలు మారలేదు
ఆకాంక్ష మారలేదు
ఉద్యమాలు ఆగలేదు
తెలంగాణ సాధించాలనే
దృఢమైన సంకల్పం
వెలుగుతూనే ఉంది
ప్రవాహమై సాగుతూనే వుంది

నేడది సునామియై
ప్రభుత్వాలను పార్టీలను
కబలిస్తునే ఉంది
ప్రళయం సృష్టిస్తూనే వుంది
తెలంగాణతోనె శాంతిస్తుంది
జై తెలంగాణ ! జై జై తెలంగాణ !!





## విజయ స్వర వీణ నా తెలంగాణ !!

బి. కాళిదాస్ 9441360174

ప॥ విప్లవ వీరుల గన్నది నా తెలంగాణ
వీరోచిత చరిత గల విజయ స్వరవీణ ॥విప్లవ॥

చ॥ నైజాం నిరంకుశత్వం నశియింపగ పోరాడి
రజాకర్ల రాక్షసత్వమంతమొంద దునుమాడి ॥విప్లవ॥

చ॥ కొమరం భీమ్‌ను గన్న వీరభూమిది
సురవర కవులను గన్న ధన్యభూమిది ॥విప్లవ॥

చ॥ తనలోనే నదులన్ని తన్మయించి పారుతుంటె
తనబిడ్డల నోటికి చుక్కనీరు దక్కకుంటె ॥విప్లవ॥

చ॥ ఆనకట్ట లేవిరా వాటి ఎత్తెంతరా
జూరాల ఎత్తుజూడు సాగర్ సగమంతరా ॥విప్లవ॥

చ॥ ఎలక్షన్లకెర ఆయె నా తెలంగాణ
నీళ్ళు నిధులు తరలిపాయె నీకు లేదు టికానా ॥విప్లవ॥

చ॥ ఆంధ్రదేశ చంద్రుడిలో అమావాస్య తెలంగాణ
పున్నమి విరబూసేలా పూరింపుము శంఖవాణి ॥విప్లవ॥

చ॥ అమరవీర త్యాగ ఫలం అనుభవించవేలరా
వెనక నీవు కాదురా వెనక్కి నెట్టారురా ॥విప్లవ॥

## తెలంగాణ జయగీతం !

కమలేకర్ రామచంద్రర్‌జీ రావు
9490411734

జయగీతం పాడుదామురా
తల్లీ తెలంగాణ జయగీతం పాడుదామురా
గల్లీ నుండి ఢిల్లీదాక
పల్లెలు పట్నాలన్ని మారు మోగునట్లు

పిల్లలు పెద్దలు వృద్ధులు
మహిళలు ఉద్యోగులు సకల జనులేకమైరి
ముక్త కంఠముతో గొంతెత్తినారురా
మా తెలంగాణ మా హక్కని అడ్డు
మాకెవ్వరని

ముల్కీ రూల్సును మాయజేసి
ఆరొందల పది జీవోను పనికి రాదు పొమ్మనిరి
హైద్రాబాదు మాదన్నారు
హైద్రాబాదు అభివృద్ధికి ఆంధ్రోల్లే కారణమన్నారు
తెలంగాణ సాధనకై తెగించి పోరాడుదాం
పిడికిలి బిగించుదామురా

బస్సులు రైళ్ళు రహదారులన్ని
బందుజేసి కదం తొక్కుదామురా
అమరులైన వందలాది
త్యాగధనులకు జోహారులర్పించుదామురా
తెలంగాణ సాధించుకొందాము
తల్లి తెలంగాణ
జయగీతం పాడుకుందాము





## చేతులు మంటలై లేస్తున్నయ్

పరిమళ్ 9441081842

ఇంగ్లీష్ బూట్లకింద నలిగినా
మానీల్లకెల్లే తీసిన
మెతుకులు అంటీ మెరిసినంక
అల్లూరిని మరిచి తెల్లోడిని నెత్తికెక్కించు కున్నవ్

మద్రాస్ బండకిందనుండి
నీచేతినైతే తీసుకున్నవ్
బాసపేరుమీద
మా బతుకులమీన గుట్టలనే కూసవెట్టినవ్

పేగులనిండా
ఆకలిని నింపినపుడు
ఊరంతా గడీలల్ల కాలుతున్నప్పుడు
గాలికి బదులు సంకెల్లు కదులుతున్నపుడు
నీకు గోరి కదుతం కొడుకోయని
తుపాకులై దుంకినపుడు
మాకాల్లకు బంధమే ఏసింది మరోగద్ద నీడ నెత్తిమీది కొచ్చింది

ఇంగ్లాండు అద్దంలో చూస్తెనె తెలుస్తది
నెహురయ్యా అసలు రూపం
వీలుకానప్పుడు ఇడిపోవచ్చన్న పూజారి
తెగకుండానే బంధమేసిండు

బతుకు మూలమూలల్లోకి
ఎడారివేళ్ళు పాతుకు పోయినయ్
అటుదిక్కు సూస్తె పొద్దుటి కొబ్బరాకులమధ్య
నవ్వుతున్న లేతసూరీడు
కారిన కన్నీళ్ళు కత్తులై లేస్తే

ఈ నేలనేలంతా నెత్తుటితో అలికారు
హామీలన్ని ఆవిరైనంక
రెండు నదులమధ్య నిండామునిగినంక
సిమ్మసీకట్ల
గూట్లకింక గుడ్డిదీపమైనా రాదని
పదేండ్లసంది పొర్లుకుంటా పొర్లుకుంటా
పొంగుతున్న పోరు

ఓట్లేసుకన్న టోపి
బల్లిలా సీటుకత్కపోయింది
సిన్న జీతాన్ని తన్నేసి అటెండర్ టోపి
పిడికిలెత్తింది

అన్ని పాయలూ అల్లిబిల్లిగా అల్లుకుంటూ
ఆటై.... పాటై......
రోడ్లనిండా జెండాలై ఎగురుతున్నయ్

గవర్నమెంట్ కాళ్లులేని మొండెంలా
కుంటిదై కూలవడుతున్నది

ఇయ్యాలా తెలంగాణ శిరసెత్తి పారుతున్న ఊరేగింపు
గురివైపు దూసుకు పోతున్న బాణాల గుంపు

సింగరేణి బొగ్గగనుల్లో ఇగ రాజుకున్న మంట
సకల ఉద్యోగులు పుల్లలేసి ఉదుతున్నరు

మన స్వప్నం
బంతిపువ్వులా నవ్వేటందుకు
గవర్నమెంటు ముక్కు మూసేటందుకు
చేతులు మంటలై లేస్తున్నయ్
ఇగ మంటలై లేస్తున్నయ్





## తెలంగాణ కొట్లాట

పున్నమి వెంకటయ్య
9581235315

కొట్లాట పీకులాట
ఎందుకొస్తయ్? ఎప్పుడొస్తయ్?
నీకు నాకు బాగుంటె
ఈ లొల్లులెందుకైతయ్
కంటి పాపకు నిద్రకరువై
చంటి పాపలా ఏడ్చి ఏడ్చి
కండ్ల నీరు కరువై
తడి ఆరిన పొడి కండ్లకు
ఎరుపెక్కితే వొచ్చేది....... కొట్లాట!!

రెక్కాడితే గాని డొక్కాడని
మాబోటి బతుకులకు
మృష్టాన్నం మాటెందుకు?
మండుటెండల్లో మట్టితీసి మోసి
గడ్డపారయినట్టి సేతులు
కాయలు గాసి
మాడిన డొక్కలకు
గొడ్డుకారం ముద్దలంటే
రాదా ..... కొట్లాట! పీకులాట !!

ఆకాశ హర్మ్యాల సౌధాల సంగతి
మాకెందుకు.....?
గుడ్డి పిట్టగూటిలో
ముదురు కున్నట్లు..
కోడిపెట్టకింత
గంపసాటు వెట్టినట్టు
మూడు తరాల జూసిన

పూరిగుడిసెను
నన్ను రాబోయే తరాలకు
పంచిపెట్టమంటుంటే ?
పడదా పీకులాట ! కొట్లాట !!

నిద్రవాయె నిలువ నీడవాయె
గూడువాయె ఉన్న తోడు వాయె
పూలు బూసే సెలకలన్ని
పల్లేరు గాయలాయె సెరువులోన నీళ్ళు లేక
జెల్ల పిల్ల గిలగిల లాడే పాలు తాగే బట్ట మేక
బతికి బట్ట కట్టదాయె గాటి కాడి పశువులన్ని
నోటి కాడి మేత లేక కత్తి కింత కండ లెక్క
నోటి పాలౌతుంటే పడదా లడాయి ....!

## జైజైర తెలంగాణ !!

కట్టా ప్రణీత 6వ తరగతి

జై తెలంగాణ మన పోరు తెలంగాణ
ప్రజా తెలంగాణ జై జైర తెలంగాణ !!
ర్యాలీలు బతుకమ్మలు రొట్టెల పండుగలు
బస్సుల బందు ఇబ్బందుల సందు
బళ్ళ బందు ఎందుకు? తెలంగాణ
సాధించెటందుకు
మంత్రులు ఎమ్మెల్యేలందరు
కలిసి ఉంటే తెలంగాణ రాదా ?
వీర తెలంగాణా నా పోరు తెలంగాణ
ప్రజా తెలంగాణ ! జైజైర తెలంగాణ !!





## నా తెలంగాణ గాండ్రించే పడగాడ్పు

కె. లక్ష్మణ్‌గౌడ్ 9392140465

నా తెలంగాణ కోటి రతనాల వీణ
కాదు శతకోటి వియథల వీరగాథ
రాజకీయం నట్టేట ముంచిన శాపగ్రస్త తెలంగాణ
స్వార్థం బరితెగించి దోచబడ్డ నా దీన తెలంగాణ
వ్యక్తిత్వం లుప్తమైన దౌర్భాగ్యుల చేతిలో కోలుబొమ్మ
తరతరాల బానిస బ్రతుకుల శిక్షా వేదిక నాతల్లి తెలంగాణ
దోపిడి పర్వంలో నిలువెల్లా దోయబడ్డ దీనురాలు నా తెలంగాణ
కురుక్షేత్రంలో ద్రౌపది నేడు హాహాకారాల మధ్య విలవిల్లాడే సుమం
రాజకీయ కీచకులు చెరబట్టి హింసించిన దుష్టత్వం
స్వేచ్ఛా వాయువుకై పరితపించే దీనత్వం
అన్యాయం అక్రమాల పెనుసవాళ్ళకు
నిస్సహాయంహో ఆహుతైన
అమాయక బిడ్డలు
తల్లిగుండెలో ప్రతిక్షణం మండే దావానలం
జన్మనిచ్చిన తల్లుల ఆగర్భశోకం
కాగలదా సమస్య పరిష్కారానికో
మార్గం
పార్టీలమధ్య అధికార దాహం వికృత క్రీడ
కారాదు కారణం బంగారు జీవితాల ఆత్మాహుతి
చరిత్ర పుటల్లో ఎన్నెన్ని రక్తపు మడుగులో
మనజాతి నేర్వని పాఠాలు ఎన్నెన్నో
పసిప్రాణాలు ఉద్వేగంలో ఆత్మబలిదానాలు
అమ్మల గుండెల్ని పిండే ఆగర్భశోకాలు
ఆగాలి ఈ మారణ హోమం
కావాలి ప్రశాంత అరుణోదయం
మేథోమదనం చిలికే అమృతభాండం
మీటాలి కోటి రతనాల తెలంగాణ వీణ

## తల్లి తెలంగాణ

యం. అనిత 9492809752

నేడు గల్లీలోన ఢిల్లీలోన
తల్లుల నోట పిల్లల పాట
జై తెలంగాణ

మనస్సుల్లోన దరువుల్లోన
పార్టీల్లోన పదవుల్లోన
ఒకే మాట తెలంగాణ

తల్లుల కడుపుల కోత
త్యాగవీరులన్న బిరుదుల మోత
ఏ నేతకు పట్టదెందుకు
ప్రజల నోటి తెలంగాణ

ధీర తెలంగాణ
వీర తెలంగాణ
ఘన పోరు తెలంగాణ
రణహోరు తెలంగాణ
జన శ్వాస తెలంగాణ

అమరుల త్యాగం
వృథాపోదు
అక్కా తమ్ముళ్ళము
అన్నా చెల్లెండ్లము
పిడికిలెత్తి పదం పాడి
జనాల్నంత పోగుజేసి
వినిపిస్తాం పోరు సాగిస్తాం
తల్లి తెలంగాణను విముక్తి గావిస్తాం





## ఇంకా కలిసుంటామా !

కె.జి.ఆర్.ఎస్. 9440348265

మానీళ్ళు మీకు, కన్నీళ్ళు మాకు
కలిసుందామా ?
ఖజానా మీకు, ఖాళీ చిప్పలు మాకు
కలిసుందామా?
వరద మీకు, వరం మీకు, కరువు మాకు కాటి మాకు
కలిసుందామా?
మీ భూముల పైరు పచ్చ,
మా భూములు బీళ్ళు బీటలు
కలిసుందామా ?
చదువు మీకు కొలువు మీకు, గడిమాకు గంజి మాకు
కలిసుందామా?
పెత్తనం మీకు ప్రేమలు మీకు,
బానిసత్వం మాకు వలసజీవితాలు మాకు
కలిసుందామా ?
కొడిగడుతున్న మా బతుకులు అపహాస్యం మీకు
కూలుతున్న తమ్ముళ్ళ ఆశయాలు అడియాసలు మీకు
కలిసుందామా ?
పోరుతున్న తెలంగాణ సాగరాదు మీకు
జనం కోరుతున్న తెలగాణ కలగా మిగలాలి మీకు
కలిసుందామా?
మా పంచన మీ వంచన సాగుతున్న
కలిసుంటామా?
మనుషుల్లో మమత లేని
మతలబుల మాయలతో కలిసుంటామా?
ఏకమై సాగుతాము అనేకమై పోరుతాము
తెలంగాణ సాధనకై ఎంతకైన పోతాము
ఇంకెంత ఎత్తుకైన ఎగురుతాము
తల్లి బంధనాల విముక్తికై ప్రాణమైన
తృణప్రాయమని అర్పిస్తాము

## జనగీతం

ఇరువింటి వెంకటేశ్వర శర్మ 9441943949

ప॥ తూరుపు తొలివాకిట వెలుగుతోంది రవికిరణం
శిరమెత్తి కదులుతోంది వీర తెలంగాణం
జనహోరు తెలంగాణం మన సకల జనుల ప్రాణం
॥వీర॥

చ॥ పోతన ప్రవచించిన భక్తి భావ సాగరం
భాగవత ప్రబోధమై పంచెను సారం
లలిత కళలు విలసిల్లిన శిల్పకళా గోపురం
అణువణువు పాడుతోంది సకల జనుల గీతం
॥ వీర ॥

చ॥ రాణి రుద్రమదేవి నడయాడిన ప్రాంగణం
చురకత్తులు కదను దొక్కె సంకుల సమరాంగణం
కరములెత్తి పూరించెను కదన పాంచజన్యం
పల్లెపల్లె పలుకుతోంది సకలజనుల గీతం
॥ వీర ॥

చ॥ దాశరథి పలికించిన రతనాల వీణ
తీగలన్ని తెగిపోతూ ఒరుగుతోంది చూడు
పేగులన్ని పెనవేసి స్వరములన్ని శృతిజేసి
అలుపెరుగక మీటుతోంది సకలజనుల రాగం
॥ వీర ॥

చ॥ అందమైన కట్టడాల రాజధాని నగరం
కుట్రల కుతంత్రాల కుములుతోంది నిరంతరం
పెన్నును వెన్నుగ జేసి రక్తాన్ని సిరాగా పోసి
అక్షరమై నిలుపుదాము సకలజనులచరితం ॥ వీర ॥





## తెలంగాణమా ! మా ప్రాణమా !!

గన్నోజు శ్రీనివాసాచారి
9490145913

తెలంగాణమా మా ప్రాణమా
నాల్గుకోట్ల ప్రజల నవ్య గానమా

కార్మికులు కర్షకులు ఉద్యోగులంత కల్సి
ఓర్మితోడ మహిళలంతా ఒక్కటై సాగువేళ
కష్టాలు నష్టాలు కడపోరుదాకనే
ఇష్టంతో తెలంగాణ అహింసతో సాదిద్దాం

జలరాశిని ఒకవైపు దోపిడి చేస్తున్నారు
గనులను మరోవైపు ఘనులై కాజేస్తున్నరు
మా గుండెల నిండుగ తెలంగాణ నాదమే
సీమాంధ్రులు వెళ్ళుదాక పాలివారి వాదమే

ఉద్యమాల గర్జనకు కవిగాయక గేయాలు
గళమెత్తి పాడుతుంద్రు తెలంగాణ కోసమే
సకలజనుల సమ్మె శాంతిగానె సాగుతుంది
యువనాయక జయధ్వాన స్వర పదార్చనే

తెలంగాణ కోసమే విద్యార్థి లోకమే
జలతరంగ వాహినియై జై కొట్టుచున్నది
పల్లెపట్నమంతట తెలంగాణ మాటలే
ఆత్మహత్యలేవద్దు! తెలంగాణయే ముద్దు !!

## మా తెలంగాణ

డా॥ గొట్టుముక్కుల నరసింహ శర్మ
9848584953

అబ్బబ్బ లగడపాటి
తబ్బిబ్బు చేస్తువుండవ్
ఎవడబ్బసొమ్ము అని
ఎకరాలు కొనుక్కుని
లాంకోల ఫ్యాక్టరీలు
లక్షలకు కోట్లకెదిగి
తెలంగాణ సొమ్ము దిని
తెలగమ్మ రొమ్ము తన్నే
సంస్కారి నీవు కొడుకా !

సమానమ్ము మాదు సొత్తు
అందుకే ఇన్నాళ్ళ పొత్తు
అధికంగా రేగి తేను
పాతాళం తొక్కుతారు
ఢిల్లీలో సోనియమ్మ
కాంగిరేసు తొత్తులమ్మ
విభజనకు విభేదించి
తాయిలాలు అందిస్తారు

నాలుగున్నర కోట్ల ప్రజలం
ఎలుగెత్తి చాటుతున్నాం
మా తెలంగాణ మాకు ఇస్తే
జేజేలు పలుకుతాము !!





## తీర్పు

విరజాజి రామిరెడ్డి 9440801423

నాటి పెద్దల సుద్దులన్ని
గద్దలెత్తుకపాయె
నెటి పెద్దలకు గద్దెలుంటే చాలు
పట్టించుకోరు ప్రజల మేలు

ఆరుసూత్రాలన్నారు
ఆరువందల పది జీవో అన్నారు
అన్నింటినీ తుంగలో తొక్కారు
అంతటా అన్యాయమే చేశారు

అగ్గువకు మా భూములు కొన్నారు
అభివృద్ధి చేశామన్నారు
మీకొరకా?
మా కొరకా ?

పుట్టినచోటే మనిషిని
బానిసగా మార్చే విష సంస్కృతి
ఎక్కడైనా
ఏనాడైనా
నశించాల్సిందే

కలసిఉంటే కలదు సుఖము
అందమైన ఈ వాక్యాన్ని
కూరూపిగా మార్చారు
కలసి ఉంటూ కలహించుకోవడం కన్నా

విడిపోయి
చెడిపోకుండా బ్రతకడం మిన్న

## తెలంగాణ సూర్యుడా !

దాసరి సుందర్ 9966487576

తెలంగాణ మట్టినే
నుదుటి బొట్టుగా నిల్పి
తెలంగాణ జాగృతికై
ఉద్యమాన్ని చేపట్టి
తెలంగాణ నినాదానికి
సరికొత్త ఊపిరిలూది
నాలుగుకోట్ల మంది గుండె చప్పుడైనావు

నీ అడుగు ఓ ప్రభంజనం
నీ మాట ఓ శాసనం
నీ పలుకు ఓ వేద సూక్తం

ఆంధ్ర పాలకుల అహంకారాన్ని
అంటగాల్చిన అగ్నిహోత్రుడా !
తెలంగాణ యువత భాగ్య విధాతా!!

అడగకుండానే పోరాట మార్గాన్ని
వరంగా ఇచ్చిన భోలా శంకరా !
ఈ మట్టి వాసన ఉన్నంత వరకు
అమరుడవే జయ శంకరా !!

తెలంగాణ యువత
అమ్ములపొదిలో బాణానివి
మండె గుండెతో వెలుగులు
విరజిమ్మిన పాశుపతానివి
తెలంగాణ సూర్యుడా! లేదు
నీకు అస్తమయం !!